చందా వివరాలు
సంవత్సరము చందా కి పంపి రూపాయలు
ఆరు నెలలకు „ 3-౦౦-౦ „
బ్రిటిషిండియాలో సంవత్సరం దా. కల్దారు
విడి ప్రతిక ౦-౧-౩
పాత ప్రతిక వెల ప్రత్యేకము

# గోలకొండపత్రిక
# Golkonda Patrika

The only Popular Paper that reaches the masses in the Dominionns

BEST MEDIUM — FOR — ADVERTISEMENT

Vol. 18 — No 86 | Published on every Monday and Thursday· Hyderabad·Dn· | 20—3—1944


డా. జె. సి. ఘోష్, ఎం. ఎ.
యఫ్, సి, యస్, (లండన్) యం, సి, యస్, (అమె)
అయుర్వేదశాస్త్రి, భాగల్పూర్ కాలేజిలో
పూర్వము రసాయనిక శాస్త్రాచార్యులు

## ప్రకటన

16-1-1944 నుండి శ్రీనివాస మెడికల్ అండు ఫ్యాక్టరీస్ రేపల్లె (గుంటూరుజిల్లా) వారిని మద్రాసు రాజధానికంతకు దేశీయసంస్థానములతో సహా మా సోల్ ఏజంట్లుగా ఏర్పాటుచేసినామని సంతోషముతో తెలుపుచున్నాము.

కావున, మా ప్రోత్సాహకులు, ఏజంట్లు, గ్రాహకులు, మా సోల్ ఏజంట్లకు యిదివరకుకంటె యధికముగా సహాకారము చేయుదురుగాక యని కోరుచున్నాము

మా ప్రోత్సాహకుల కందరికి వసతిచేయుటకై యింకాలేదుకనగా, ప్రస్తుత పరిస్థితుల ననుసరించి యీ క్రింది ఔషధముల వెలను యీ క్రిందివిధముగా తగ్గించినాము

| | | | | | |
|---|---|---|---|---|---|
| మృతసంజీవని | 11 ఔన్సులు | 3-0-0 | శారిబాదిసరస | 8 ఔన్సులు | 1-8-0 |
| మృతసంజీవని | 22 ,, | 5 8-0 | | 16 ,, | 4-13-0 |
| చ్యవనప్రాశ | 1 సేరు రు 6 అర్ధసేరు రు 3 | | | 24 ,, | 4-2-0 |
| | పావుసేరు 1-8-0 | | | | |

ఇతర ఆసవములు, అరిష్టములు 8 ఔన్సులబుడ్డి 1-2 0. 16 ఔన్సులు 2-0-0 24 ఔన్సులవి రు 2-14-0. వీటిలో కర్పూరారిష్ట, దశమూలారిష్ట కస్తూరి, మహాద్రాక్షారిష్ట 6 సం॥ పాతవిచేరవు

## సాధనౌషధాలయము
### ఢక్కా (బెంగాల్)
ప్రఖ్యాతివహించిన ఆయుర్వేదౌషధాలయము

---

### కస్తూరిబాయి కైజాతీయ జ్ఞాపకచిహ్నము

శ్రీమతి కస్తూరిబాయిగాంధిగారి జ్ఞాపకార్థమై 75 లక్షల రూపాయలనిధిని ప్రోగు చేసి, త్వరలో రానున్న గాంధి మహాత్ముని 75 వ జన్మదినమునాడు నిధిని వారికి సమర్పించుటకై శ్రీ ఠక్కరు బాపా హాజ్ మాలవ్యా గారు సూచించారు. ఈనిధిని ప్రత్యేకముగా భారత నారీమణుల అభివృద్ధికై ఉపయోగింపబడవలెనని నిర్ణయమైనది. మూర్ఛావ లేకీన పండిత మాలవ్యాగారి అధ్యక్షతన యింకారంనుండి ప్రముఖ నాయకులు సమావేశమై, యీ నిధిని ప్రోగుచేయుటకై దేశీయులకొక విజ్ఞప్తి చేసినారు.

---

### హఠాత్తు సోదాలు అరెస్టు పరంపరలు

బొంబాయి, మార్చి ౧౫

బొంబాయి ప్రత్యేక పోలీసు శాఖవారు బొంబాయినగరంలో కొన్ని ప్రదేశాలను హఠాత్తుగా సోదా చేయుచు, అసందర్భముతో ౧౫ మంది నరెస్టుచేసిరి వీరిలో శ్రీ బాపట్ గారును, లోకమాన్య అనే మరాటీ దినపత్రిక సహాయసంపాదకులు ఉన్నారు. వీరు కాంగ్రెసు కార్యాల్లో పాల్గొంటున్నారని ఇండియారక్షణ నిబంధనల క్రింద నిర్బంధింపబడిరి.

---

### ఛోటా హైదరీ నియామకం?

న్యూఢిల్లీ, మార్చి ౧౮

పారిశ్రామిక, సివిల్ సప్లయిశాఖకు కార్యదర్శిగా పని చేయుచున్న యం.యస్.యం. హైదరీ గారికి, నిజాం ప్రభుత్వ ప్రధానిపదవి యిస్తారని పుకారులు ప్రబలుచున్నవి. ప్రస్తుత ప్రధానులైన ఛత్తారీనవాబ్ గారి మూడుసంవత్సరముల ఉద్యోగానంతరం, యీ యనరావచ్చునట.

వీరు శ్రీ॥ శే॥ సర్ అక్బర్ హైదరీపుత్రులు, ఇండియా ప్రభుత్వంలో ప్రస్తుతము వీరినిర్వహిస్తున్న పదవి త్వరలోనే భారతీయులకే దొరుకుతుంది. యింతకు పూర్వం ప్రాచ్యదేశాల సప్లయి సంఘానికి అధ్యక్షులుగా కార్యదర్శిగాను యుండి పేరు ప్రఖ్యాతులు పొందినారు.

---

### ప.ము.వ. నిజాం స్టేట్ రైల్వే
## నోటీసు

ఒకటి, రెండు తరగతులలో బెర్తులు యిదివరకు ప్రయాణసమయములో రాత్రి 9 గంటలనుండి ఉదయం 6 గంటలవరకు రిజర్వు చేయబడు చుండెను. కాని యిప్పటినుండి రాత్రి 10 గంటలనుండి ఉదయం 7 గంటల వరకుగా పై కాలములు మారును.

చీఫ్ కమర్షియల్ మేనేజరు

---

### శ్రీ తారణ సంవత్సర
## సిద్ధాంత పంచాంగము

ఈ బుక్కు-పంచాంగము, ఘడియలలోనుండి, గోదావరి తీరవాసులు, దైవజ్ఞభూషణులగు సిద్ధాంత శిరోమణి
బ్ర. వే. చింతలపూడి సుబ్రహ్మణ్య సిద్ధాంతి గారిచే
గుణింపబడినది.

నూరు ప్రతుల ఖరీదు రూ. 12-0-0

వలయువారు —

### శ్రీ రామా బుక్ డిపో
మార్కెటువీధి, సికిందరాబాదు దక్షిణ.

---

### క్రిష్ణానివాస్ హేర్ ఆయిల్

రిజిష్టరు నెం. ౨౩౩

ఈ తైలము నుపయోగించిన మెదడునకు పుష్టి, కండ్లకు చలువ కలిగించి, నిద్ర లేమి, వెంట్రుకలు రాలుట, ఇంద్రలుప్త [అనగా బట్టతల. చుండు మొదలగు దుర్లక్షణములను పోగొట్టి వెంట్రుకలు మృదువుగను గుబ్బగను, ఆకర్షణీయముగా పెరుగుటకుపకరించును.] ఈ తైలము ప్రత్యేకముగా బట్టతలయున్నవారు కూడా వాడినపక్షమున ఒక నెలలోపల వెంట్రుకలు ఆకర్షణీయముగావచ్చును. ఈ తైల లేపనమున వయసు మించినవారుకూడ నవయవ్వనులవలె కనబడుదురు. వెల సీసా ౧కి రు 1-8-0

క్రిష్ణా అండ్ బ్రదర్సు, ఈసామియాబజారు, హైదరాబాదు-దక్కన్.

---

## ప్రకటన

సికిందరాబాదు మాచర్ల శంకరయ్యనగు నేను ఇందు మూలముగా అందరకు తెలియ చేయుట యేమనగా నాతమ్ముడగు మాచర్ల శివచిదంబరయ్య, సికింద్రాబాదుఘట కేశ్వరము వగైరాల యందున్న మా సమిష్టి ఆస్తులను నాకు తెలియకుండా అమ్మదలచి కొన్నట్లు తెలియుచున్నది. అట్లు చేయబడు విక్రయములు మొదలగునవి నా అనుమతి లేనిదిచెల్లజాలవనియు దురాశతో కొన్నట్లయిన నా చేజరుపబడే యావత్తు చర్యలకు మీకు, కొనబోయేదు ఆస్తులున్నా బాధ్యులుగా వుండగలరని రూఢిగా నమ్మవలెను.

మాచర్ల శంకరయ్య

---

## కావలెను

ఫిటర్లు, టర్నర్లు, ఎలక్ట్రిషియన్లు, మెకానిక్కులు, మోల్డర్లు, స్ప్రింగ్ స్మిత్తులు, టిన్‌కరులు, వెల్డర్లు, బ్లాక్‌స్మిత్తులు, కావలెను. మంచిపనివారు మాత్రమే దరఖాస్తులు పంపాలె. గుమాస్తాలు, మెట్రిక్యులేట్లు, లేక యస్. యస్. యల్. సి. పరీక్ష ప్యాసైన వారు. స్టాక్ కీపింగ్ అనుభవము గలవారు ఆఫీసు పనిపైవు తెలిసినవారు అవసరమున్నారు.

దరఖాస్తులు వెంటనే బాక్సునెం. 430 C/o గోలకొండపత్రిక హైదరాబాదుదక్కన్

---

స్త్రీలసూతివ్యాధులు, బవాసీరు, అరిసెమొలలు, లవ్యాధులకు వారము రెండు వారములలో ఆపరేషనులేకుండా చికిత్స

## కొన్ని యోగ్యతాపత్రములు

1. నవాబు యం. హెచ్. ఖురేషి, ఇ. ఎ. సి., అసెంబ్లీ సిష్టా:-హాకీం యం. ఎ. సావత గారు జనియాల్ చికిత్సలో నిపుణులు. 2. జనాబె ఎ. హెచ్. మీర్జా లెజిస్లేటివు ఏసెంబ్లీసభ్యులు బొంబాయి. మొండిబడ్డవ్యాధుల నివారణలో మిస్టరు యం. ఎ. సావతాగారు అందెవేసిన చెయ్యి 3. జనాబు యం. యం. కప్సరాస్, ప్రథమమేజిస్ట్రేటు మూల్తాన్— విసుగుచెందియున్న సమయములో వైద్యసావతగారి చికిత్సనాకు మేలుచేసింది. 4. మునిసిపల్ చాల్‌సూపరింటెండెంటు బొంబాయి- వైద్యసావతగారు రోగనిదానమునందును, చికిత్సయందును ప్రవీణులు. ఇట్టివారులభించుట దుర్లభము, 5. శ్రీనారాయణ్ సింగుజీ, ప్రెసిడెంటు మునిసిపలుకమిటీ ముజఫర్‌గడ్- వైద్యసావతాగారి ప్రొత్సాద్యమువల్ల త్వరలో ఆరోగ్యము చేకూరింది. 6. జనాబు రామచంద్రరావు అంతూ వకీలు హైకోర్టు, శాసనసభాధ్యక్షుడు హైదరాబాదు- అరిసెమొలలకును, పురాణవ్యాధులకును మహమ్మదు యాకూబుగారు జయప్రదమైన చికిత్స చేయగలరు 7. జనాబుఅబూబుహాసన్ సయ్యదుఅలీ అడ్వకేటు, హైదరాబాదు- బవాసీర్ నుఆపరేషనులేకుండా చికిత్సచేయుటంలో మహమ్మదు యాకూబుగారు అసమానులు.

ది పాపులర్ డిస్పెన్సరీ, గరీబ్‌ఖానా, ఘోషామహాల్ పి. అర్ పి. దఫ్తరువద్ద.

కాలము— ఉదయం 9 నుండి 1 వరకు సాయంత్రం 4 నుండి 9 వరకు పరదా ఏర్పాట్లున్నవి.

---

## స్వర్ణమాలినీ వసంతరసము.

జ్వరము, కఫజ్వరము, క్షయ, కఫముతో రక్తముపడుట, గర్భిణులకు కలుగుజ్వరము కఫము, దగ్గు, ఆయాసము, గుండెబరువు వీనినితగ్గించి, గర్భస్థశిశువును పోషించును.

వెలకు సరిపడు 1 తులం మందు రూ 12 రి. ॥.

ప్రధానకార్యస్థానము-- చరకాశ్రమము 95, అగ్రహారం - గుంటూరు.

వరంగల్ జిల్లా ఏజంట్లు:—
సుభాను మెడికల్ స్టోర్సు; రామన్నపేట, వరంగల్

---

## ప్రదర-సుధారిణి (స్త్రీలకు వరప్రసాదిని

ఈమందు యెటువంటి తెలుపు, ఎరుపు, పచ్చని ప్రదరసంబంధములకును రాను చాణము నూతనమేకాక పురాతనవ్యాధినికూడ గ్యారంటీగ కుదుర్చును- పై మందును ఒకసారివాడిన మీకేగుణము తెలియగలదు. వెల రూ. 2-8-0

## పుష్టి సుధాచూర్ణము

మూత్రములో లేక స్వప్నములో వీర్యము పోవుచున్న చో నీచూర్ణము దానిని గట్టిపరచి శక్తి కలుగజేయును. ఎటువంటి పలచని ధాతువునుకూడ కుదిర్చి గట్టిగా జేయును. సంభోగ సామర్థ్యము లేనివారికి యిది అమృతమువంటిది. వెల రూ. 2-8-0

### ప్రాణనాథ ఫార్మసీ

ఏజంట్లు— నలినీకాంత్ అండ్ బ్రదర్సు
3199. పాతజైల్‌రోడ్డు, సికింద్రాబాదు

---

## చర్చిల్, కామ్రేడ్ స్టాలిన్

ఈయిద్దరు ప్రముఖుల అలవాట్లలో చుట్టత్రాగటం ఒకటి
చుట్టత్రాగటం సౌఖ్యకరమైన అలవాటు.

## హైలైట్ కరోనా

సౌఖ్యప్రదమైన చుట్ట. దీనిని వాడండి.

### స్వామి సన్సు
ఆబిద్ రోడ్ — హైదరాబాద్-దక్కన్


Printed and Published by G. Ramakrishna Reddy at the Golkonda Power Press, Hyderabad-Dn. Editor S. Prathap Reddy, B.A. B.L.